

శ్రీ ర స్తు.

శ్రీమద్గణాధిపతయే నమః.

# శ్రీమద్గణేశస్తవరత్నావళిః.



శ్లో॥ శ్రీమద్గణేశ భవదీయపదాబ్జయుగ్మం
చిత్తాంబుజే మను సదా వినిబధ్య భక్త్యా
సర్వాంతరాయహరణాయ కరోమి సేవాం
సర్వేశపుత్ర కరివక్త్ర సదాపవిత్ర॥ ౧

శ్లో॥ దుర్గా మదీయజననీ జనకోపి భిక్షు
ర్భ్రాతాచ మే బహుముఖః ఖలు వామనోహం
ఇత్యుక్తితోపి నహియాతి పదాబ్జనమ్ర
స్సర్వేశపుత్ర కరివక్త్ర సదాపవిత్ర॥ ౨

శ్లో॥ మూఢోపి తే చరణసేవనతత్పరస్స్యా
ద్విద్యావిశేషనిపుణో భవతీతి శ్రుత్వా

సంసేవయామి చరణం శరణం ప్రపద్య
సర్వేశపుత్ర కరివక్త్ర సదాపవిత్ర॥ ౩

శ్లో॥ కైలాసశైలశిఖరోన్నతకాననేషు
ఘీంకారభీతహరిపోతనిపాతహేతుం
చిత్రక్రియాపరివృతం హృది భావయే త్వాం
సర్వేశపుత్ర కరివక్త్ర సదాపవిత్ర॥ ౪

శ్లో॥ విద్యావిశేషభరతుందిలతా ముష్టిపి
హా కష్ట మద్య వితరం త్వ్వజనాయ విద్యాః
త్యక్త్వా సుగర్భగురుతా ముపగచ్ఛ శాంతం
సర్వేశపుత్ర కరివక్త్ర సదాపవిత్ర॥ ౫

శ్లో॥ దీనావనం కురు కృపాకలితాంతరంగ
విద్యాంబరాభరణభూషితదివ్యదేహ
భవ్యాని మే వితర భాసురపాశహస్త
సర్వేశపుత్ర కరివక్త్ర సదాపవిత్ర॥ ౬

శ్లో॥ జానే న తే జపవిధిం జగతా మధీశ
జానామి నో చరణసేవనమప్యతీవ
నిర్హేతుకా మయి కృపా తవ జాయతాం భో
సర్వేశపుత్ర కరివక్త్ర సదాపవిత్ర॥ ౭

శ్లో॥ దానాదికర్మగణనా ఖలు సర్వలోకే
బహ్మశ్రితాళిపరిగీతనిజప్రభావం

సంసేవయామి సతతం సకలార్థదం త్వాం
సర్వేశపుత్ర కరివక్త్ర సదాపవిత్ర॥ ౮

శ్లో॥ శ్రీవత్సవంశజనితం కృపయాప్పనాఖ్యం
విప్రం త్వదీయచరణాంబుజభృంగభూతం
సంరక్షయాశు సకలాస్సుకలా వితీర్య
సర్వేశపుత్ర కరివక్త్ర సదాపవిత్ర॥



శ్రీరస్తు.

# శ్రీమద్గణేశస్తవరత్నావళి.



సీ॥ శ్రీసర్వమంగళాచిత్తాబ్జభాస్కర
విన్నపం బాలింపు విఘ్ననాథ
నీదివ్యమంత్రముల్ నేర్పున జపియించి
యష్టావధానాదులందు శక్తి
యుక్తులై భక్తులు రక్తులై నినుగూర్చి
జేసినపద్యముల్ జెవులనిండ
విని వేడ్క లోగల్గి విధివత్ప్రకారంబు
నీమంత్రరాజంబు నేర్పలేక

గీ॥ బాగుగా నీదుపాదముల్ భావమందుఁ
దలచి నీపూజగావింతు దయను జూపి
సమయ మియ్యాదె రక్షింప శర్వతనయ
కోర్కె లొసగూర్పు దయతోడ గుజ్జువేల్ప॥ ౧

సీ॥ వందారు నిజదాససందోహమందార
మందారమాలలీకుందహార

కైలాసభూధరకాననానంతరచార
చారణాద్యమరసంస్తవవిహార
ఖండనోర్జితవీరఖండనోజ్జ్వలశూర
ఖండితాఖిలవిఘ్నకలుషభార
సంగీతసాహిత్యసంస్తుత్యశృంగార
యంగజాహిత మనోహరకుమార।
గీ॥ శ్రవణసంజాతమారుతచలితతార
తారకాధీశపాండరతరశరీర
ధారుణీధరసంకాశ ధైర్యసార
కోర్కెలొసఁగూర్పు దయతోడ గుజ్జుపోఁడ। ౭
సీ॥ లోకేశుఁడైనను నీకు మ్రొక్కకయున్న
సత్యలోకంబేల సాగఁగలఁడె
కేశవుండైన నిన్గీర్తింపకుండినఁ
బాలసుదిండుల నెల్ల గెలువఁగలఁడె
శంకరుండైన నిశ్శంకయు లేకున్నఁ
దలఁచక శూలంబుఁదాల్పఁగలఁడె
వాసవుండైన ని న్వర్ణింపకుండిన
కులిశంబు కెంగేలఁ గూర్పఁగలఁడె
గీ॥ యట్టిఘనులైన నినుఁ దల్చకలరకుంట
గనుచు నిన్నేఁడి దాసులు ఘనతగాంట

# శ్రీమద్గణేశస్తవరత్నావళి.

తెలిసి సేవింతు విద్యలుఁ గలుగుదంట
కోర్కెలొసఁగుమా దయతోడఁ గుజ్జువేల్పు॥

సీ॥ గుజ్జువైనీవు బలుబొజ్జయు గైకొన్నఁ
గొమ్ము తేజీతోడఁ గూడియున్న
కరిరాజు శిరముచే కలితుండ వైయున్న
దంత మొక్కటి నీవు దాల్చియున్న
కెంగేలశూలంబుఁ గీలించియున్నఁ డా
పలికేలఁ బాశంబుఁ బట్టియున్నఁ
భుజగోపవీతంబు భుజభాగమందున్న
ఘనకర్ణచలనంబుఁ గలిగియున్న

గీ॥ భక్తులెల్లరు నినుఁగాంచి భయములేక
భక్తితో గొల్చుటలుజూడ పనులుఁ జెడునె
దండి వని కాదె కుడుములఁ దిండి కాడ
కోర్కెలొసఁగుమా దయతోడ గుజ్జువేల్పు॥ ౨

సీ॥ ఈశ్వరుండను పేర నైశ్వర్యదాతమై
నీతండ్రి విఖ్యాతి నెరపఁ జగతి
నంబికాహ్వయముచే సందరి నరయుచు
నీతల్లి ప్రఖ్యాతి నిలుప దిశల
నట్టివారలకు నీవాత్మజాతుండవై
కఠినమానసవృత్తిఁ గలిగి భక్త

సంరక్ష గావింప సమకట్టుకుండినఁ
గసలి దాసులు నిన్ను గాంచి మేన
గీ॥ మామపోలిక పొదన్న మాటనిజము
జేసితివటంచు నిందలు సేయకుండ
తల్లిదండ్రులపోల్కెలఁ దాల్చి నీవు
కోర్కెలానఁగూర్చు దయతోడఁ గుజ్జుపోఁడ॥ ౫

క॥ శ్రీవత్సనగోత్రప్రవ
కావిదరచితాంధ్రపద్యకోమలరససం
భావన సమ్మద మొందుము
పావన గణనాథ భక్తపాలనపరతా॥ ౬

సమాప్తము.



శ్రీరస్తు.

# గణేశస్తవరత్నావళి.



శ్రీ పాచిపేట కుమారరాజావారిచే రచియింపబడినవి.

క॥ శ్రీవరనుత కరిముఖ యాఁదె
గావింపవె చంద్రకులుఁడ ఖండేందుధర
శ్రీ విశ్వనాధమల్లప
భూవరుఁడ కరీంద్రమాల ముదమునఁగొనుమా॥ ౧

సీ॥ తొగకన్నియకు వింత వగజూపి నగియింప
వెన్నెల లేని సర్పేషుతోడఁ
బులుఁగురావన్నెలఁ బలుమారు నగఁజాలి
రాణించు గరిక తురాయితోడ
దళుకొత్తు మెఱుపు మొత్తముల మించులమించు
డంబైన పసిఁడిపుట్టంబుతోడ
నరుదంద తెలిజక్కి మొరకపల్లములందుఁ
దిరుఁగనేర్చిన కొక్కు తేజితోడ
గీ॥ ముజ్జగఁబులుఁగల చిన్ని బొజ్జతోడ
ముద్దులొలికెడు యేనుఁగ మోముతోడ

వఱలు నినుఁగొల్తు మెపుడు సంబరముతోడ
శ్రితదురితదూర కొక్కెతేజీ వజీర॥ ౨

సీ॥ హరిహరాంబుజగర్భులైన నను నీవలె
తొలి మ్రొక్కులనుఁబొందఁగలరె చెప్పుమ
యాఖేందుస్థులైన నీవాగ్రహించిన కార్యములు
చక్కగా జేయగలరె చెపుమ
యఖిలామరాజేయులైన నిన్నాదరించి
కలనలోపల నిల్వఁగలరె చెప్పుమ
త్రిజగజ్జనములైన నిజముగా నీదగు
కార్యంబులకు నడ్డఁగలరె చెపుమ

గీ॥ అయ్య వెనకయ్యవారెల్ల సరసిజాక్ష
నీకు వెనుకయ్యవారలే నిక్కమనుచు
గట్టిగ వచింతు మొగమిచ్చకంబుగాదు
శ్రితదురితదూర కొక్కెతేజీవజీర॥ 3

సీ॥ పతితాత్మకులు వీరు పతితపావనుఁడ నే నంచు
వించుక మది నెంచుమయ్య
దీనాగ్రణులు వీరు దీనపోషణుఁడ నే
నంచు నించుక మది నెంచుమయ్య
చదువెఱుంగరు వీరు చదువులప్రోడ నే
నంచు నించుక మది నెంచుమయ్య

భాగ్యహీనులు వీరు భాగ్యవంతుండ నే
నంచు నించుక మది నెంచుమయ్య
గీ॥ యెంచి యేకార్యమైనఁ గావించెనేని
మిగుల శోభను వహియించు జగతిగాన
యెంచి కర్తవ్య మిపు డాచరించుమయ్య
శ్రితదురితదూర కొక్క తేజీవజీర॥
సీ॥ ఆశ్రితపక్షపాతాభిరాముఁడవౌట
నైశ్వర్యప్రదుఁడవై యలరుటయును
దీనజనావనస్థిరమానసుఁడవౌట
తరుణేందు నొదలఁ దాల్చుటయును
కళ్యాణసంఘసంఘటనాపటుఁడవౌట
కరుణాంబురాశివై పరఁగుటయును
జాడ్యాంగకీయూహ నేఁడు గానఁగనయ్యెఁ
దలిదండ్రిపోలిక మెలఁగవలయు
గీ॥ నంచు నేగడ వహ్వారే యవనియందు
బొట్టివానికి బుట్టుబుద్ధు లనెడు
మాట నిజమాయె నోరి వామనశరీర
శ్రితదురితదూర కొక్క తేజీవజీర॥
సీ॥ హల్లకాంభోజ కల్హారాదు లవియేల
గరికపూజకె యుబ్బఁగనుదు వనుచు

పనస రసాల రంభాఫలాదు లవేల
నారికేళంబులే గోరుదనుచు
ఘృతమధుశర్కరాన్వితభక్ష్యము లవేల
కుడుములకే యాసఁగొనుదువనుచు
నతులనిష్ఠురతపోవ్రతచయాదు లవేల
తొలిమ్రొక్కులకె సంతసిలుదు వనుచు
గీ॥ విన ముదమెగాని యాశ్రితజనులచేత
నౌర గుంజిళ్ళుదీయింతువనెడుమాట
విన్న నింపుక జంకగుచున్నదన్న
శ్రితదురితదూర కొఱకు తేజీవజీర॥ ౬
సీ॥ అతులితైశ్వర్య మిమ్మని దెల్పరాదటే
కదుబత్తితో దండ్రిగారితోడ
పాలింపుమని విన్నపము సేయరాదటే
కదుబత్తితో దల్లిగారితోడ
సిరులనిమ్మని పూని చెప్పంగరాదటే
కదుబత్తితో మామగారితోడ
దీర్ఘాయువిమ్మని దెలుపంగరాదటే
కదుబత్తితో బావగారితోడ
గీ॥ మాయెడల నించుక దయాభిమానముంచి
చెలువలర నీవు విజ్ఞప్తి జేసితేని

వాసు నీముద్దు జఱుప రే మేరుధీర
శ్రితదురితదూర కొమర్ల తేజీవజీర॥ ౭
సీ॥ భయభక్తియుక్త సద్భక్త విధ్యుక్తోప
చార పూజానమస్కారములను
లయబ్రహ్మమైన బాలాజిదాసాగ్రణి
హరికథారసనుధాఝరులవలన
వర కొమ్మజోశ్య లప్పనశాస్త్రి
రచితాంధ్రగీర్వాణ పద్యసంకీర్తనముల
డమరు మృదంగ డిండిమ ఝల్లరీముఖ్య
హృద్యానవద్య సద్వాద్యగతుల
గీ॥ నీవు ముదమంద నవరాత్రి లేక విధిని
జరుపుచుండెడి మత్పురజనుల మమ్ము
సాకుమని వేరె విన్నవించంగవలెర
శ్రితదురితదూర కొమర్ల తేజీనజీర॥ ౮
సీ॥ ప్రతివత్సరంబు తప్పక నీదుసంసేవఁ
జేయునట్టుల కటాక్షింపుమయ్య
పనులందు విఘ్నంబులనుమాట కలనైనఁ
గలుగనీయక దయఁ దలఁచుమయ్య
యాయురైశ్వర్య కీర్త్యాదిసౌభాగ్యముల్
హెచ్చునట్టుల మది నెంచుమయ్య

లోపంబులున్న విలోకింప కనుకంప
జెంపార మదిని క్షమింపుమయ్య
గీ॥ యనుచు నిను వేఁడుటలు విధియనియొకాని
తెలసి భక్తులకోర్కెలు వలసినటుల
పరఁగ జేయఁగ లేవె సర్వజ్ఞతనయ
శ్రితదురితదూరకోటిక్కతేజీవజీర। ౯

కం॥ భువి భక్తి నీగణేశ
స్తవరత్నావళి పఠించు సద్భక్తులకున్
శివతనయాగ్రజుఁ డొసఁగును
నవిరల సంపదల నాయురారోగ్యములన్। ౧౦

సంపూర్ణము.



శ్లో॥ తారేశే విబుధాః కళంకమనిశం సంత్యజ్య సర్వాః
కళాస్సంగృహ్యాత్మను మోదభారమతులం గచ్ఛం
తి యద్వత్తథా। శ్రీమన్మూషకవాహనస్తుతిలసత్ప
ద్యేషు హృద్యేషు నో దోషాశ్చేద్విబుధా విసృజ్య
సుగుణాన్ స్సంగృహ్ణంతు మోదంతు భో॥

